అల్లాహ్ మాత్రమే స్తుతింపదగినవాడు. ఆయన తన దాసుని (ముహమ్మద్-స) పై ఈ గ్రంథాన్ని అవతరింప చేశాడు; అందులో ఏ విధమైన వక్రత్వాన్ని ఉంచలేదు అది సూటిగా, ఉన్నది ఉన్నట్లుగా ప్రకటించే గ్రంథం (ఖుర్ఆన్ 18 : 1)

అంతా కలిసి అల్లాహ్ త్రాడును గట్టిగా పట్టుకోండి విభేధాలలో పడకండి. (ఖుర్ఆన్ 3 : 103)


**Salafiah Educational & Welfare Trust**

(Regd No: 44 of BK IV-2010)

D.No : 1/16c, Osman nagar, Rajampet, Kadapa (Dist) 516115

Mobile : 9177972125, 9652877697


# ధార్మిక గ్రంధాల వెలుగులో సత్య సందేశం

దాసుడు - తనను పుట్టించిన ఆ దైవాన్ని మాత్రమే సేవించాలి. ఇదే అతని నిజమైన ధర్మం. ఇది సమస్త ధార్మిక గ్రంధాల మార్గ దర్శక సూత్రం-మనిషి మోక్షానికి కూడా ఇదే సరియైన ఋజుమార్గం.


**Salafiah Educational & Welfare Trust**

**COMPILED BY :**

**TRUE MESSAGE SOCIETY**

**Mobile : 8125192502**

## మేలుకో సోదరా...

హోదా, అంతస్తు, ఆస్తి, ఐశ్వర్యాలు,
తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు, కేవలం నాలుగు
రోజుల బంధాలు మాత్రమే!

ఇహలోక జీవితం అశాశ్వతమైనది
పరలోకజీవితమే మనిషికి శాశ్వత మైనది

మరణానంతరం మరో జీవితం ఉన్నది
కర్మల విచారణకు ఓ తీర్పు దినం ఉన్నది

సత్కార్యాలకు ప్రతిఫలం స్వర్గం ఉన్నది
దుష్కార్యాలకు ప్రతిఫలం నరకం ఉన్నది

సత్యాన్ని అన్వేషించే వారి కోసమే
ఈ సత్య సందేశ సమితి ఉన్నది.

**సర్వమానవులకు ఇదొక సందేశం. వారిని హెచ్చరించాలని, యధార్ధంగా దేవుడు కేవలం ఒక్కడే అని వారు తెలుసుకోవాలని. బుద్ధి ఉన్నవారు గ్రహించాలని, ఇది (ఖుర్ఆన్) పంపబడింది.**

**(ఖుర్ఆన్ 14:52)**

ఇంతకు పూర్వం మేము గ్రంథాన్ని
ఇచ్చిన ప్రజలు దీనిని (ఖుర్ఆన్)ను
విశ్వసిస్తారు. ఇది వారికి వినిపించ
బడినప్పుడు, వారు ఇలా అంటారు,
"మేము దీనిని విశ్వసించాము ఇది
నిజంగానే మా ప్రభువు తరఫునుండి
వచ్చిన సత్యం. మేము మొదటి నుండీ
ముస్లిములమే." (దైవ విధేయులమే)

(ఖుర్ఆన్ 28 : 52)

సృష్టికర్త అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభం...

**Name :....................................**

**Mobile :....................................**

**ఓ ఆదమ్ కుమారా**

**నా ప్రియ సోదరా!**

నేడు సమాజాన్ని పట్టి పీడిస్తున్నటువంటి సమస్యలలో అశాంతి కూడా ఒక సమస్య అని చెప్పటంలో ఎంతమాత్రం సందేహంలేదు. ఎందుకంటే నేడు సమాజంలో ఏ మూల చూసినా దొంగతనాలు, దోపిడీలు, బాంబులు, బ్లాస్టులు, వ్యభిచారం, మధ్యపానం, సినిమాలలో అశ్లీలత పెరిగిపోవడం, యువత చెడు వ్యసనాలకు, దురలవాట్లకు బానిస కావటం సర్వసాధారణమైపోయినది. మరి ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే సమాజ పరిస్థితి ఏమి కావాలి? పై రుగ్మతలను ఆపే బాధ్యత ఎవరిది. పాలకులదా లేక పౌరులదా? అసలు ఈ సమస్యకు పరిష్కారమే లేదా?

మరి మనం పోగొట్టుకున్న శాంతిని తిరిగి పొందాలంటే ఏంచెయ్యాలి? ఇదే ఈరోజు మనందరి ముందు ఉన్నటువంటి అతి ముఖ్యమైన చిక్కు ప్రశ్న. పై అన్ని సమస్యలకు ఖచ్చితమైన పరిష్కార మార్గం ఉన్నది అంటున్నారు....

**Salafiah Educational & Welfare Trust వారు**

దుష్కార్యాలకు, పాప కార్యాలకు పాల్పడే ప్రతీ వ్యక్తి ఈ క్రింది విషయాలలో జ్ఞానం సంపాదించి ఆపైన దానిపై ఆచరణాత్మకంగా నిలబడితే అతను తన జీవితకాలంలో ఎన్నడు కూడా ఎలాంటి దుష్కార్యాలకు లేదా పాప కార్యాలకు పాల్పడే అవకాశం ఉండనే ఉండదు.

**అవేమిటంటే!**

1, ముందుగా మనలో ప్రతీ ఒక్కరూ ఆ దైవం పట్ల భయ భక్తి కలవారై ఉండాలి.

2, నేను చేస్తున్న ఈ దుష్కార్యానికి లేదా ఈ పాప కార్యానికి నన్ను పుట్టించిన ఆ దైవం ప్రతీక్షణం నన్ను చూస్తూనే ఉన్నాడనే  భావన కలిగి ఉండాలి.

3, మరణించిన తరువాత నాకు మరో జీవితం ఉన్నది. (అంటే)తీర్పు దినాన నేను తిరిగి రెండవసారి మళ్ళీ

లేపబడతాను అనే భావన కలిగి ఉండాలి.

4, ఆ రోజు (తీర్పు దినాన) నేను చేసుకున్న సత్కార్యాలకు, దుష్కార్యాలకు నన్ను పుట్టించిన దైవం ముందు నిలబడి సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది అనే భావన కలిగి ఉండాలి.

5. ఇహలోకంలో దైవాజ్ఞానుసారం జీవితం గడిపితే పరలోకంలో శాశ్వతమైన స్వర్గం లభిస్తుందని పరి పూర్ణ విశ్వాసం కలిగి ఉండాలి.

6. దైవం చూపించిన మార్గం కాకుండా మనిషి తన ఇష్టానుసారం జీవితాన్ని గడిపితే పరలోకంలో విఫలమై శాశ్వతమైన నరకం ప్రాప్తం అవుతుందనే సత్యాన్ని తెలుసుకోవాలి.

**ఇకరండి సోదరులారా!**

మనమందరం ఆ దైవం పట్ల భయభక్తులు కలవారై ఉండాలని తెలుసుకున్నాంకదా! అయితే విషయం ఏమిటంటే మనమందరం ఏ దేవుని పట్ల భయ భక్తి కలిగి ఉండాలి?

మనందరినీ పుట్టించిన ఆ సృష్టికర్త పట్లనా?

లేక స్వయంగా మన చేతులతో మనమే సృష్టించుకున్న

దేవుళ్లపట్లనా? అసలు ఈ సృష్టిలో ఎంతమంది దేవుళ్ళు ఉన్నారు? ఒక్కడేనా లేక అనేకులా? ఈ ప్రశ్నలకు మన ధార్మిక గ్రంథాలు ఏమని సమాధానం చెబుతున్నాయి? రండి! మనలోని అసూయ ద్వేషాలను, భేద భావాలను తొలగించి సత్యాన్ని అన్వేషించుదాం, సత్యాన్ని స్వీకరించుదాం.

సత్యాన్ని అన్వేషించాలన్న సంకల్పంతో ఈ పుస్తకం చదివే ప్రతి పాఠకునిపై సర్వలోకాలకు ప్రభువు అయిన అల్లాహ్ యొక్క శాంతి మరియు శుభాలు వర్షించుగాక...ఆమీన్.

ఈ భూమిపై మానవుడు మనుగడ ప్రారంభించినప్పటి నుంచి వారిని ఋజుమార్గం చూపెట్టడానికి ప్రతి కాలంలో, ప్రతి భాషలో ప్రవక్తలను పంపాడు ఆ దైవం. ఆ పరంపరలో చిట్ట చివరగా వచ్చిన ప్రవక్త ముహమ్మద్ (ఆయనపై శాంతి కలుగుగాక) ఈ ప్రవక్త పై అవతరించిన చివరి దైవ గ్రంథమే ఖుర్ఆన్.

**నోట్** : ముహమ్మద్ ప్రవక్తకు అహ్మద్ అనే మరో పేరు కలదు.

## ఈ ఖుర్ఆన్ ఎవరి కోసం?

పవిత్ర ఖుర్ఆన్ అవతరించిన నెల రమజాన్ నెల.

<u>మానవులందరికి</u> (ఆ గ్రంథం) మార్గ దర్శకం. ఋజు మార్గం చూపే, సత్యసత్యాలను వేరు పరచే స్పష్టమైన ఉపదేశాలు అందులో ఉన్నాయి. **(ఖుర్ఆన్ 2: 185)**

## ఖుర్ఆన్ ఇచ్చే సందేశం?

మీ దేవుడు ఒక్కడే. ఆ కరుణామయుడుఆ కృపాకరుడు తప్ప మరొక దేవుడు లేడు. **(ఖుర్ఆన్ 2: 163)**

అల్లాహ్ సజీవుడు, నిత్యుడు, విశ్వ వ్యవస్థకు ఆధారభూతుడు వాస్తవానికి ఆయన తప్ప మరొక దేవుడు లేడు. **(ఖుర్ఆన్ 3:2)**

## ఎవరిని ఆరాధించాలి?

మానవులారా! మిమ్మల్ని మీకు పూర్వం వారిని పుట్టించిన ఆ ప్రభువును ఆరాధించండి. దీని ద్వారానే మిమ్మల్ని మీరు రక్షించుకునే అవకాశం ఉంది.

**(ఖుర్ఆన్ 2: 21)**

కనుక ప్రవక్తా! నీవు ఆయననే సేవించు. ఆయననే నమ్ముకో. **(ఖుర్ఆన్ 11: 123)**

# దేవుడు ఒక్కడే అనే సందేశం కేవలం ఖుర్ఆన్ గ్రంథం మాత్రమే ఇస్తుందా?

## వేద గ్రంథాలు

య యేక ఇత్తముష్టుహి ః

ఒక్కడు సాటి సమానము లేని ఆయననే స్తుతించండి.

**(ఋగ్వేదం 6:45:16)**

మా చిరన్యద్విషంశత **(ఋగ్వేదం 8:1:1)**

ఆ దేవుని తప్ప మరెవరినీ పూజించకండి

దేవో మహాబసి **(అధర్వణ వేదం 20:58:3)**

దేవుడు ఒక్కడే గొప్పవాడు.

## ఉపనిషత్

యేకం యెవద్వితీయం **(చాందొగ్య ఉపనిషత్ 6:2:1)**

ఆయన ఒక్కడు-ఆయన తప్ప మరోకడు లేడు.

ఎవరైతే ఈ లోకాలను తన ప్రభావంతో రక్షించి, పాలిస్తాడో ఆ దేవుడు ఒక్కడే **(శ్వేతాశ్వత రోపనిషత్ 3:12)**

## భగవద్గీత

అర్జునా! ఎల్ల వేళలా **ఆ** సర్వేశ్వరుడినే

శరణుపొందుము ఆయన అనుగ్రహముచే సర్వోత్తమ శాంతిని శాశ్వత మోక్షాన్ని పొందగలవు. **(గీత 18: 62)**

## బైబిల్ గ్రంథం

పాత నిబంధన గ్రంథంలో యెహోవా ఇలా సెలవిస్తున్నాడు. భూదిగంతముల నివాసులారా! నావైపు చూసి రక్షణ పొందండి. దేవుడిని నేనే మరి ఏ దేవుడు లేడు. **(బైబిల్ యేషయా 45:22)**

యేసు క్రీస్తు ఇలా సెలవిచ్చెను: ఓ ఇస్రాయేలు వినుము మన దేవుడైన ప్రభువు అద్వితీయ ప్రభువు.

**(బైబిల్ మార్క్ 12:29)**

**నోట్:** అద్వితీయుడు అనగా-రెండవ వాడు కాని వాడు అని అర్థం.

**గమనించవలసిన విషయం:** ఈ లేఖనాన్ని స్వయంగా యేసుక్రీస్తు చెప్పి ఉన్నారంటే, యెహోవా వేరు యేసు క్రీస్తు వేరు అని స్పష్టమౌతుంది. ఎలా అనగా... ఈ లేఖనాన్ని బోధించేటప్పుడు యేసు వారు ఇస్రాయేలు మధ్య ఉన్నారు కదా! అంటే యెహోవా దేవుడు సప్త ఆకాశాలపై ఉండగా... యేసువారు క్రింద భూలోకంలో నశించిన

ఇస్రాయేలు సంతతిని ధర్మోపదేశాలు చేస్తు వారి సంస్కరణ కోసం పాటు పడ్డారు. ఈ కారణంగా యెహోవా వేరు యేసుక్రీస్తు వారు వేరు అని స్పష్టంగా తెలుస్తుంది.

నా యంతట నేను రాలేదు.! నన్ను పంపినవాడు సత్యవంతుడు, ఆయనను మీరు ఎరుగరు నేను ఆయన వద్ద నుండి వచ్చితిని. ఆయన నన్ను పంపెను కనుక నేను ఆయనను ఎరుగుదనని బిగ్గరగా చెప్పెను.

(యోహాను 7: 28, 29)

**నోట్:** పైలేఖనం ద్వారా కూడా యెహోవా వేరు యేసుక్రీస్తు వేరు అనే విషయం తెలుస్తుంది.

యెహోవా యే యేసు రూపంలో భూమి మీదకు వచ్చాడు అని అంటారు కదా!

**దానికి వివరణ**

దేవుడు భూమి మీదకు వస్తాడా అనే విషయాన్ని తెలుసుకోవాలి.

నిశ్చయంగా దేవుడు (సృష్టికర్త) ఈ లోకమందు నివాసము చెయ్యడు. **(బైబిల్ 1 రాజులు 8:27)**

పైన పేర్కొన్న వాక్యం పాత నిభందనలోనిది అది కొట్టి

వేయబడ్డది. పాత నిభందన వేరు కొత్త నిభందన వేరు అంటున్నారు.

## దానికి వివరణ

ధర్మశాస్త్రమైనను ప్రవక్తల వచనములైనను కొట్టివేయ వచ్చితినని తలంచవద్దు; నెరవేర్చుటకే గానీ కొట్టి వేయుటకు నేను రాలేదు.! **(మత్తయి 6: 17)**

ఇంకా యేసు వారు ఎమన్నారంటే: నీ దేవుడైన ప్రభువు (యెహోవా) నకు మ్రొక్కి ఆయను మాత్రమే సేవింపవలెను. **(బైబిల్ లూకా 4:8)**

## దేవుని రూపం గురించి

ఆయన (అల్లాహ్) ను పోలిన వస్తువు సృష్టిలో ఏది లేదు. **(ఖుర్ఆన్ 42:11)**

ఆయనకు సాటి ఎవరూ లేరు. అయనకు పుట్టుక లేదు. కనుక పూజకు అర్హుడు. **(యజుర్వేదం 40:8, 32:3)**

నతస్య ప్రతిమ ఆస్థి

ఆయనకు సాటి సమాన రూపము ఏది లేదు.

**(శ్వేతాశ్వతరోపనిషత్ 4:19)**

నేను దేవుడను నన్ను పోలిన వాడు ఎవడూ లేడు.

(బైబిల్ యేషయ 46:9)

## దేవుడు కంటికి కనిపించడు

ఏ చూపులు కూడా ఆయనను అందుకో లేవు. కాని ఆయన అన్ని చూపులను పరివేష్టించి ఉన్నాడు. **(ఖుర్ఆన్ 6:103)**

దేవుని రూపం ఇంద్రియాల పరిధిలో నిలవదు. కన్నులతో ఆయనను ఎవరూ చూడలేరు.

**(శ్వేతాశ్వతరోపనిషత్ 4:20)**

ఈ సమస్త ప్రపంచం అవ్యక్త రూపుడగు (చెప్పుటకు వీలుకాని రూపం) నాచే నిర్మించబడి ఉన్నది. **(గీత 9:4)**

కావున మీరు ఎవరితో దేవున్ని పోల్చుదురు? ఏ రూపమును ఆయనను సాటి చేయగలరు ?

**(బైబిల్ యేషయా 40:18)**

మీరు ఏ కాలమైనను ఆయన స్వరము వినలేరు. ఆయన స్వరూపము చూడలేరు.(బైబిల్ యోహాను 5: 37)

## దేవుడు జన్మించడు

ఆయన ఎవరికి జన్మించలేదు. అయనకు ఎవరు జన్మించలేదు. **(ఖుర్ఆన్ 112 :3)**

ఆయన జన్మించినవాడు కాదు. **(యజుర్వేదం 32:3)**

ఆయనకు తల్లిదండ్రులు లేరు. ఆయనకు ప్రభువు లేడు. (ఆయనే ప్రభువు) అయనకు గురువు లేడు. పోలిక లేదు. ఆయనే మూలం ఆయనకు సంరక్షకుడు లేడు.

(శ్వేతాశ్వతరోపనిషత్ 6:9)

ఎవడు నన్ను పుట్టుక లేని వానిగాను. ఆది లేని వానిగాను, సర్వలోక ప్రభువుగాను తెలుసుకుంటాడో అతడు అజ్ఞానము వీడి సమస్త పాపముల నుండి లెస్సగా విడవ బడుచున్నాడు. (గీత 10:3)

నాకు ముందుగా ఏ దేవుడునూ నిర్మింపబడలేదు. నా తరువాత ఏ దేవుడును ఉండడు. నేను నేనే యెహోవాను నేను తప్ప వేరొక రక్షకుడు లేడు.

(బైబిల్ యెషయ 43:10)

## దేవుడు మరణించడు

ఆయన (అల్లాహ్) సజీవుడు. ఎన్నడు మరణించడు.

(ఖుర్ఆన్ 25:58)

జననము, మరణము అనే దోషములు లేనివాడే శుభ ప్రదమైన దేవుడు. (యోగశిఖోపనిషత్)

ఆ దైవానికి నాశనం లేదు (గీత 8:20)

యెహోవాయే నిజమైన దేవుడు. అయనే జీవము గల

(చావులేని) దేవుడు. **(బైబిల్ యిర్మియా 10:10)**

ఈ పుడమిపై ఉన్న ప్రతి వస్తువు నశించి పోయేదే. మహోన్నతుడైన నీ ప్రభువు (అల్లాహ్) మాత్రమే మిగిలిపోతాడు. **(ఖుర్ఆన్ 55:26)**

## దేవుడు మానవ అవతారం ధరించడు

ఇది (ఖుర్ఆన్) సకల లోకాల ప్రభువు అవతరింపజేసినది. దీనిని తీసుకొని విశ్వసనీయమైన ఆత్మ (జిబ్రాయిల్ - దైవదూత) నీ (ముహమ్మద్ (స) హృదయఫలకంపై అవతరించినది.

**(ఖుర్ఆన్ 26: 192-194)**

**నోట్** : దైవ సందేశం అందజేసే నిమిత్తం దేవుడు తన దూతను అవతరింపజేస్తాడే తప్ప దేవుడు మాత్రం మానవ అవతారం ధరించి ఇహలోకానికి రాడు.

నాశరహితమై నట్టియు, సర్వోత్తమ మైనట్టియు, సర్వశ్రేష్టమైనట్టియు, నా రూపము తెలియని అవివేకులైన ఈ జనులు అవ్యక్త రూపుడగు నన్ను (చెప్పటానికి వీలు లేని రూపం) మానవ అవతారం దాల్చిన వానిగా భావించుచున్నారు. **(గీత 7:24)**

నిశ్చయంగా దేవుడు ఈ లోకమందు నివాసము చేయడు. (బైబిల్ 1 రాజులు 8:27)

**నోట్:** పైలేఖనం ద్వారా తెలుస్తున్న విషయం ఏమిటంటే ....ఈ లోకములో నివాసము చేసిన వారు దైవం కాలేరు అని స్పష్టమౌతుంది.

## ఇక్కడ ఒక విషయాన్ని అర్థంచేసుకోవాలి

చూడండి ఉదా: మనము ఒక వెయ్యి సం॥ వెనుకకు వెళ్లిపోయామనుకోండి ఆ కాలంలో రాజుల పరిపాలనా ఉన్న విషయం మనందరికీ తెలిసిందే. అప్పటి చట్టాలు, పద్ధతులు, రాజులు తమతమ రాజ్యాలను పరిపాలించిన విధానం ఇలా ప్రతీ కాలంలో రాజులు తమకు అనుకూలమైన చట్టాలు రూపొందించుకుని వాటి ప్రకారం రాజ్యాలు యేలేవారని అనటానికి చరిత్రే సాక్ష్యం.

కాలం మారుతున్న కొద్దీ మనిషి ఆలోచనలు కూడా మారి తనకు అనకూలమైనటువంటి చట్టాలను (రాజ్యాంగాన్ని) తయారు చేసుకుంటూ నేడు ఆధునిక యుగంలోకి అడుగు పెట్టేసాడు మానవుడు.

ఆధునిక యుగంలో పుట్టి పెరిగి ఇప్పుడు ఉన్న చట్టాలను (రాజ్యంగాన్ని) కాదని అప్పుడెప్పుడో వెయ్యి సం॥ క్రితం

ఉన్న రాజుల కాలం నాటి చట్టాల ప్రకారం నడుచుకుంటాను అని ఎవరైనా అంటే... అప్పుడు మీరేమంటారు? రాజుల కాలంనాటి చట్టాలు, పద్ధతులు అవి ఆ కాలంలోనే ఆమోద యోగ్యం అయ్యేవి. అప్పటి చట్టాలు వేరు ఇప్పుడున్న చట్టాలు వేరు. ఏ కాలంనాటి చట్టాలు ఆ కాలంలో మాత్రమే ప్రభుత్వం దగ్గర ఆమోదింపబడతాయి అంటారుకదా! వాస్తవం కూడా ఇదే.

అలాగే ఖుర్ఆన్ కంటే పూర్వం పంపబడినటువంటి చట్టాలు అవి ఆ కాలాలలో మాత్రమే దేవుని వద్దకు చేరే మార్గంగా ఆమోదింపబడేవి. ఈ కాలానికి దైవం ద్వారా మానవాళి అందరికోసం పంపబడినటువంటి చట్టం (చివరి ధర్మశాస్త్రం) ఖుర్ఆన్.

**దేవుడు ఒకొక్క కాలానికి ఒకొక్క చట్టం (ధర్మశాస్త్రాన్ని) ఇచ్చాడు. అది, ఆ కాలంలో దేవుని వద్దకు చేరే మార్గంగా పరిగణించబడేది. మనిషి మోక్షానికి ఆ చట్టం ఆ కాలానికి ఒక సాధనంగా ఉండేది.**

**ఈ కాలానికి దేవుడు సర్వమానవాళి కోసం పంపించినటు వంటి చట్టం (ధర్మశాస్త్రం) ఖుర్ఆన్.**

యథార్థం ఏమిటంటే ఈ ఖుర్ఆన్ పూర్తి సరియైన సవ్యమైన మార్గాన్ని చూపుతుంది. తనను విశ్వసించి మంచి పనులు చేసేవారికి గొప్ప ప్రతిఫలం ఉంది అనే శుభవార్తను అందజేస్తోంది. పరలోకాన్ని విశ్వసించని వారికి మేము వ్యధాభరితమైన శిక్షను సిద్ధపరచి ఉంచాము అనే వార్తను వినిపిస్తోంది. **(ఖుర్ఆన్ 17: 9-10)**

సమస్త ధార్మిక గ్రంథాలు దేవుడు ఒక్కడే అని ఆయన అవ్యక్త రూపుడని బోధిస్తున్నప్పటికీ మరి ఇంతమంది దేవుళ్ళు వెలుగులోకి రావడానికి కారణం ఏమిటి ? అంటే....... మనకు ధార్మిక గ్రంథాల పట్ల సరియైన అవగాహన లేకపోవటమే!

**సోదరులారా!**

ఒక్కడి గానే ఉన్నటువంటి ఆ ఏకైక దైవం గురించి తెలుసుకోవాలంటే ఆయనకు ఉన్నటువంటి గుణలక్షణాల ద్వారానే తెలుసుకోవాలి.

**దేవుని (సృష్టికర్త) గుణలక్షణాలు అంతిమ దైవగ్రంథం ఖుర్ఆన్ వెలుగులో...**

ప్రవక్త ముహమ్మద్(స) ఇలా చెప్పండి. అల్లాహ్ ఒక్కడు. అద్వితీయుడు అయన ఎవరి ఆధారము, అవసరము లేనివాడు. అయనకు సంతానము లేదు. అయన కూడా ఎవరి సంతానము కాదు. ఆయనకు సాటి సమానము ఎవరూ లేరు. **(ఖుర్ఆన్ 112:1-4)**

అల్లాహ్- ఆయన తప్ప ఆరాధ్య దైవం ఎవడూ లేడు. సకల చరాచర సృష్టికి మూలాధారం. ఆయన సజీవుడు, నిత్యుడు, అనంతుడు. ఆయన నిదురపోడు. ఆయనకు కునుకు రాదు. **(ఖుర్ఆన్ 2:255)**

ఆయనే అల్లాహ్; ఆయన తప్ప ఆరాధ్యుడెవ్వడూ లేడు దృశ్యాదృశ్య విషయాలన్నీ ఎరిగినవాడు. ఆయనే కరుణామయుడు, కృపాశీలుడు. ఆయనే అల్లాహ్, అయన తప్ప ఆరాధ్యుడెవ్వడూ లేడు. ఆయన చక్రవర్తి, ఎంతో పరిశుద్ధుడు, సురక్షితుడు, శాంతి ప్రదాత, సంరక్షకుడు, సర్వాధికుడు, తన ఉత్తరువులను తిరుగులేని విధంగా అమలు పరచేవాడు, ఎల్లప్పుడూ గొప్పవాడుగానే ఉండేవాడు. ప్రజలు కల్పించే దైవత్వపు భాగస్వామ్యం వర్తించని పరిశుద్ధుడు అల్లాహ్, సృష్టివ్యూహాన్ని రచించేవాడు, దానిని అమలు పరచేవాడు, ఆపై దాని ప్రకారం రూపకల్పన చేసేవాడు. ఆయనకు మంచి పేర్లు

ఉన్నాయి. ఆకాశాలలోనూ, భూమిలోనూ ఉన్న ప్రతివస్తువూ అయనను స్మరిస్తోంది. ఆయన సర్వాధికుడు, వివేక వంతుడూను. **(ఖుర్‌ఆన్ 59: 22-24)**

## దేవుని పేరేమిటి?

"అల్లాహ్ అని అయినా పిలవండి. లేదా రహ్మాన్ అని అయినా సరే. ఏ పేరుతో అయినా పిలవండి. అయనకు గల పేర్లు అన్నీ చక్కనివే. **(ఖుర్‌ఆన్ 17: 110)**

సాధారణంగా మీరు ఒక విషయాన్ని గురించి ఆలోచించి ఉండవచ్చు. అదేమిటంటే! ఉదా: మనమందరం మనుషులమే కానీ, మనలో ఎవరైనా ఒకరినొకరు మనిషి అని పిలుచుకోము. ఒక మనిషికున్న పేరునుబట్టి అతనిని ఆ పేరుతోనే పిలుస్తుంటాం. ఎందుకంటే ఆ పేరు ద్వారానే అతను సమాజంలో గుర్తించబడతాడు కాబట్టి.

అలాగే మనము నిత్యజీవితంలో వాడే వస్తువులకు కూడా పేర్లు ఉండటం మీరు గమనించే ఉంటారు. ఈ ప్రపంచంలో ప్రతీ మనిషికీ ఒక పేరు, ప్రతీ వస్తువుకు ఒక పేరు ఉన్నప్పుడు ... మరి ఈ విశ్వమంతటినీ సృష్టించి, సమస్తజీవులను పుట్టించి, పోషించే ఆ దైవానికి పేరు

ఉండకూడదా? అరబీ భాషలో సర్వమానవాళి కోసం పంపబడినటువంటి చిట్టచివరి దైవ గ్రంథం ఖుర్‌ఆన్‌లో ఆ దైవం అల్లాహ్ అనే పేరుతో పరిచయం అయ్యాడు.

అల్లాహ్ అంటే సృష్టికర్త మరియు ఆరాధనకు అర్హుడు అని అర్థం.

**సోదరులారా!**

ఈ భూమిపై ఉన్న ప్రార్థన స్థలాల పై ఒక సారి దృష్టిని సారించండి. అక్కడ ఎవరిపూజ జరుగుతుంది. ఆ మహనీయుల వాస్తవికత ఏమిటి? వారు ఈ సృష్టిలో ఏదైనా ఒక వస్తువునైనా సృష్టించారా? కనీసం ఒక గడ్డిపోచనైనా సృష్టించారా? పోని, మేమే దేవుళ్లము మమ్మల్ని ఆరాధించండి అని వాళ్ళు చెప్పి ఉన్నారా? అసలు వాళ్ళు తిరిగి మళ్లీ ఎప్పుడు లేపబడుతారో కనీసం వారికి ఆ విషయమైనా తెలుసా?

అల్లాహ్‌ను వదిలి, ప్రజలు వేడుకుంటున్న ఇతర శక్తులు ఏ వస్తువుకూ సృష్టికర్తలు కారు. వారు స్వయంగా సృష్టింపబడినవారు, నిర్జీవులే కాని సజీవులు కారు. వారు ఎప్పుడు (మళ్ళీ బ్రతికించబడి) లేపబడతారో వారికెంత మాత్రం తెలియదు. **(ఖుర్‌ఆన్ 16: 20-21)**

అల్లాహ్‌ను కాదని ఇతరులను సంరక్షకులుగా చేసుకున్నవారు సాలెపురుగును పోలి ఉన్నారు. అది తన కొరకు ఒక ఇల్లు కట్టుకుంటుంది. అన్ని ఇళ్ళకంటే అతి బలహీనమైన ఇల్లు సాలెపురుగు ఇల్లే అవుతుంది. అయ్యో! వారికి ఈ విషయం తెలిస్తే ఎంతబాగుంటుంది! వారు అల్లాహ్‌ను కాదని దేనిని వేడుకున్నా అల్లాహ్ దానిని బాగా ఎరుగును. ఆయనే సర్వ శక్తిమంతుడు, వివేచనాపరుడునూ. **(ఖుర్ఆన్ 29: 41)**

ఆ మహానుభావులు స్వయంగా సృష్టించబడ్డారే తప్ప వాళ్ళు ఏ వస్తువుకు సృష్టికర్తలు కారు. మరి అలాంటప్పుడు అన్నింటిని సృష్టించిన అల్లాహ్ (సృష్టికర్త) ను వదిలేసి ఏమీ సృష్టించని వారిని కొలవటం ఎంతవరకు న్యాయము?

మానవులారా! ఒక ఉదాహరణ ఇవ్వబడుతోంది; దానిని శ్రద్ధగా వినండి! అల్లాహ్‌ను కాదని మీరు ఏ దేవుళ్లను వేడుకుంటున్నారో, వారందరూ కలసి సమైక్యంగా ఒక్క ఈగను సృష్టించలేరు. అంతేకాదు, ఒకవేళ ఈగ వారినుండి ఏదైనా వస్తువును లాక్కుపోయినా, వారు దానిని విడిపించుకొని రాలేరు. సహాయాన్ని అర్థించేవారూ బలహీనులే, సహాయం కోసం అర్థింపబడేవారూ బలహీనులే. అల్లాహ్ గొప్పతనాన్నే వారు గుర్తించవలసిన

విధంగా గుర్తించలేదు. నిజానికి అల్లాహ్ మాత్రమే శక్తిమంతుడు, గౌరవనీయుడూను. **(ఖుర్ఆన్ 22:73)**

అల్లాహ్‌ను కాదని, ప్రళయం వచ్చేవరకు అతనికి సమాధానమైనా ఇవ్వలేని వారిని, మొరపెట్టుకునేవారు తమకు మొరపెట్టుకుంటున్నారనే విషయం కూడా ఎరుగనివారిని వేడుకునే వాడి కంటే పరమ భ్రష్టుడైన మానవుడు ఎవడుంటాడు? **(ఖుర్ఆన్ 46: 5)**

## అల్లాహ్‌తో పాటు ఇతర దేవుళ్ళు ఉండి ఉంటే...

ఒక వేళ ఆకాశాలలో, భూమిలో ఒక అల్లాహ్ తప్ప ఇతర దేవుళ్లు కూడా ఉంటే, అప్పుడు (భూమి, ఆకాశాల రెండింటి వ్యవస్థ ఛిన్నా భిన్నమై ఉండేది. కనుక అధికార పీఠానికి ప్రభువైన అల్లాహ్ వారు కల్పించే విషయాలనుండి పరిశుద్ధుడు. అయన తాను చేసే పనులకు (ఎవరిముందు) జవాబుదారుడు కాదు. కాని అందరూ (ఆయన ముందు) జవాబుదారులే. **(ఖుర్ఆన్ 21: 22-23)**

మరియు మరొక దేవుడు ఆయనతో పాటు లేడు. ఒక వేళ అలా అయితే, ప్రతీ దేవుడు తన సృష్టిని తీసుకుని వేరు పడిపోయేవాడు. తరువాత వారు ఒకరిపై ఒకరు దండయాత్రలు చేసి ఉండేవారు. వారు కల్పించే విషయాలు

ఏమాత్రం వర్తించని పరిశుద్ధుడు అల్లాహ్, గోప్యంగా ఉన్నదానిని, బహిరంగంగా ఉన్నదానిని ఎరిగినవాడు. దైవత్వంలో వారు ప్రతిపాదించే భాగస్వామ్యానికి ఆయన అతీతుడు. (ఖుర్ఆన్ 23 : 91-92)

## అల్లాహ్‌యే అందరి దైవం

తాను తప్ప మరొక దైవం లేడు అనే సత్యానికి స్వయంగా అల్లాహ్ యే సాక్ష్యం ఇచ్చాడు. దైవదూతలు, సమస్త జ్ఞానులు కూడా ఆ మహాశక్తి వంతుడూ, ఆ మహా జ్ఞాని తప్ప వాస్తవానికి మరొక దైవం లేడు అని నిజాయితీగానూ, న్యాయంగానూ సాక్ష్యం ఇస్తారు.

(ఖుర్ఆన్ 3: 18)

అల్లాహ్‌యే అందరి దైవం అని చెప్పటానికి ఒక **ఉదా:** ఏమిటంటే మానవులందరిని పుట్టించినవాడే వారి నిజమైన దైవం కావాలి కదా! మనము ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే ప్రపంచములోని మానవులందరు ఒకే పద్ధతి ద్వారా ఉనికిలోకి తీసుకోరాబడ్డారా? లేక వివిధ రకాలుగా ఉనికిలోకి తీసుకోరాబడ్డారా? మానవులందరు ఒకే శరీర నిర్మాణాన్ని ఎలా కలిగి ఉన్నారు? పుట్టించేవాడు ఒక్కడే ఉన్నప్పుడు కదా

ఇలా సాధ్యపడేది?

## మానవుడు ఉనికిలోకి ఎలా తీసుకురాబడ్డాడు?

మేము మానవుణ్ణి మట్టియొక్కసారంతో సృష్టించాము; తరువాత అతనిని ఒక సురక్షితమైన స్థానంలో పడే బిందువుగా మార్చాము. ఆ తరువాత ఈ బిందువుకు ముద్ద ఆకారాన్ని ఇచ్చాము. ఆ పైన ముద్దను కండగా చేశాము, తరువాత మంసపు కండను ఎముకలుగా చేశాము. ఆ తరువాత ఎముకలకు మంసాన్ని తొడిగాము. ఆపైన దానిని భిన్నమైన సృష్టిగా చేసి నిలబెట్టాము. కనుక అల్లాహ్ ఎంతో పరిశుద్ధుడు. సృజనకారులందరి కెల్లా ఉత్తమ సృజన కారుడు. దాని తరువాత మీరు తప్పని సరిగా మరణిస్తారు. మళ్లీ ప్రళయంనాడు నిస్సందేహంగా లేవబడతారు. **(ఖుర్ఆన్ 23:12-16)**

ఆయన (అల్లాహ్) మీ తల్లుల గర్భాల్లో మూడేసి చీకటి తెరలలో మీకు ఒక రూపం తరువాత మరొక రూపాన్ని ఇస్తూ పోతున్నాడు. (ఈ కార్యాలు నిర్వహించే) ఈ దేవుడే మీ ప్రభువు, సృష్టి సామ్రాజ్యం ఆయనదే. ఆయన తప్ప మరోక దేవుడు లేడు అలాంటప్పుడు మీరు ఎలా మరలింప బడుతున్నారు? **(ఖుర్ఆన్ 39: 6)**

అల్లాహ్ మిమ్మల్ని మీ మాతృ గర్భాలనుండి మీరు ఏమి ఎరుగని స్థితిలో ఉండగా బయటకు తీశాడు.

ఆయన మీకు చెవులు ఇచ్చాడు, కళ్ళు ఇచ్చాడు, ఆలోచించే మనస్సు ఇచ్చాడు – మీరు కృతజ్ఞులు కావాలని.
(ఖుర్ఆన్ 16: 78)

## అల్లాహ్ అంటే కేవలం ముస్లింల దేవుడేనా?

సోదరులారా!

పై ఖుర్ఆన్ వాక్యాలు గమనించారు కదా! ప్రపంచములోని ప్రతీ మనిషి పుట్టుక ఒకే విధంగా జరిగిందని, మరియు పుట్టించేవాడు కూడా ఒక్కడే.... ఆయన అల్లాహ్ అని తెలుసుకున్నాము. మరి అలాంటప్పుడు అల్లాహ్ కేవలం ముస్లింలకే దేవుడు ఎలా అవుతాడు?

అందరిని ఒకే పద్ధతిలో పుట్టించి మాతృ గర్భంలోనే శిశువు పోషణ బాధ్యతలు తీసుకున్న ఆయన కొందరికి మాత్రమే దైవం ఎలా కాగలడు? ఆయన సమస్త జీవులను పుట్టించిన (సృష్టికర్త) అన్న స్వల్ప విషయం కూడా మీకు అర్థం కావటం లేదా?

“అల్లాహ్ ఏ విషయంలో అయినా ఒక నిర్ణయం తీసుకుంటే దాన్ని అయిపో అని ఆజ్ఞాపిస్తాడు. అంతే అది

అయిపోతుంది". (ఖుర్ఆన్ 19:35)

## ఎవరిని వేడుకోవాలి?

ఆయనను మాత్రమే వేడుకోవటం ధర్మం. ఇక వారు ఆయనను వదలి వేడుకుంటున్న ఇతర శక్తులు అవి వారి ప్రార్థనలకు ఏ సమాధానమూ ఇవ్వలేవు. వాటిని వేడుకోవటం ఒక మనిషి నీళ్లవైపు చేతులు చాచి, దానిని "నీవు నా నోటిదాకా వచ్చేయ్యి" అని అభ్యర్థన చేసిన మాదిరిగా ఉన్నది. వాస్తవానికి నీరు అతని వద్దకు చేరటం జరగదు. కనుక ఇదే విధంగా అవిశ్వాసుల ప్రార్థనలు కూడా గురిలేని బాణాలేతప్ప మరేమీ కావు. భూమ్యాకాశాలలో ఉన్న ప్రతీ వస్తువూ ఇష్టం ఉన్నా ఇష్టం లేకపోయినా అల్లాహ్‌కే సజ్దా (సాష్టాంగం) చేస్తూ ఉన్నది. అన్ని వస్తువుల నీడలు ఉదయం, సాయంత్రం ఆయన ముందు వంగుతాయి.

(ఖుర్ఆన్ 13: 14-15)

## సృష్టి పూజకు అనుమతి ఉందా?

ఈ రేయింబవళ్లూ, ఈ సూర్య చంద్రులు అల్లాహ్ సూచనలోనివే. సూర్యచంద్రులకు సాష్టాంగపడకండి; వాటిని సృజించిన దేవునికి సాష్టాంగపడండి; నిజంగానే మీరు ఆయనను ఆరాధించేవారు అయితే.

(ఖుర్ఆన్ 41: 37)

సోదర మహాశయులారా!

ఇక్కడ చెప్పబడుతున్న విషయాలను బుద్ధి, వివేవకంతోను మరియు శాంతియుతమైన మనస్సుతో ఆలోచించే అవసరం ఎంతైనా ఉంది. ఎందుకంటే! ఉదా: మీ ఇంటి బయట తలుపుపైన ఉన్న మీ **NAME BOARD** తీసేసి ఎవరైనా మరొకరి **NAME BOARD** తగిలిస్తే మీరు ఊరుకుంటారా?

చూడండి. ఇది వింటేనే ఎంతో తప్పుగా ఉంది కదు! ఇతరులు చేసే పొరపాట్లవలన మనకు ఎంతో కోపం వస్తుంది. దాని కారణంగా ఒకొక్క సారి మనము వారిని కోపగించుకుంటాం. మరి భూమి, ఆకాశాలను వాటి మధ్య ఉన్న సమస్త సృష్టిని సృష్టించి, నిత్య జీవితంలో మానవులకు అవసరమయ్యే గాలి నీరు మరియు సమస్త ఆహార పదార్థాలను సమకూర్చిన ఆ అల్లాహ్‌ను వదిలేసి ఈ సృష్టిలో ఏమీ సృష్టించని వారిని పూజిస్తే మరి ఆ దైవానికి కోపం రాదా....?

సృష్టించేవాడు, అసలు ఏమీ సృష్టించనివాడు ఉభయులూ సమానులేనా? మీరు ఈ మాత్రం అర్థం చేసుకోలేరా? ఒక వేళ మీరు అల్లాహ్ అనుగ్రహాలను

లెక్కించ దలిస్తే లెక్కించలేరు. యథార్థమేమిటంటే ఆయన ఎంతో మన్నించేవాడు, కరుణామయుడు. ఆయన మీ బాహ్యాన్ని ఎరుగును మీ గోప్యాన్ని ఎరుగును.

(ఖుర్‌ఆన్ 16:17-19)

## సృష్టిని పూజిస్తే- కలిగే పర్యవసానం

వారు అల్లాహ్‌ను కాదని కొందరిని తమ దేవుళ్ళుగా చేసుకున్నారు, వారు అండగా ఉంటారని భావించారు. కాని అండగా ఎవరూ ఉండరూ. ఆ దేవుళ్ళు అందరూ వారి ఆరాధనలను నిరాకరిస్తారు. పైగా వారికి ప్రత్యర్థులవుతారు.

**(ఖుర్‌ఆన్ 19 : 81,82)**

అంధఃతమ ప్రవిషన్తియె అసంభూతి ముపాసతే తతోభుయ ఇవతే తమోయఊః సంబుత్యాగ్ రతః

**(యజుర్వేదం 40: 9)**

ఎవరైతే ప్రాకృతిక వస్తువులను (గాలి, నీరు మొ॥వాటిని పూజిస్తారో వారు చీకటి (నరకం) లో ప్రవేశిస్తారు. ఎవరైతే సంభూతి (అంటే) (సృష్టితాలు) (మానవుని చేత తయారయ్యే వస్తువులు బొమ్మలు) ని పూజిస్తారో వారు మరింత అంధకారంలో ప్రవేశిస్తారు.

నరులను ఆశ్రయించి శరీరులను తన ఆధారముగా

చేసుకొనుచు తన హృదయమును యెహోవా మీద నుండి తొలగించు కొనువాడు శాపగ్రస్తుడు.

(బైబిల్ యిర్మియా 17:5)

పైన ఆకాశమందే గాని క్రింద భూమియందే గాని భూమి క్రింద నీళ్ళయందే గాని యుండు దేని రూపమునైనను విగ్రహమునైనను నీవు చేసుకొన కూడదు. వాటికి సాగిల పడకూడదు. వాటిని పూజించ కూడదు. ఏలయనగా నీ దేవుడైన యహోవా నగు నేను రోషముగల దేవుడను (నిర్గమ కాండము 20 : 4-5)

అల్లాహ్ దృష్టిలో కేవలం షిర్క్ (దేవునికి సాటి కల్పించటం) ఒక్కటే క్షమార్హం కానిది. అది తప్ప తానుకోరిన వారి అన్ని పాపాలను ఆయన క్షమిస్తాడు. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసినవాడు అపమార్గాన బహుదూరం వెళ్ళిపోయాడు. (ఖుర్ఆన్ 4:116)

## మరణానంతర జీవితం

ప్రతి ప్రాణి మరణాన్ని రుచి చూడవలసి ఉన్నది. తరువాత మీరంతా మా (అల్లాహ్) వైపునకే

మరలింపబడతారు. **(ఖుర్ఆన్ 29:57)**

అర్జునా! సమస్త ప్రాణికోట్లు ప్రళయ కాలమున నా ప్రకృతిని జేరి అందు అణిగియుండును. తిరిగి సృష్టికాలమున వారిని మరల నేను సృజించు చున్నాను **(గీత 9:7)**

దీనికి ఆశ్చర్యపడకండి ఒక కాలము వచ్చు చున్నది. ఆ కాలమున సమాధులలో ఉన్న వారందరూ ఆయన (యెహోవా) శబ్దము విని మేలు చేసిన వారు జీవన పునరుత్థానమునకు, కీడు చేసిన వారు తీర్పు పునరుత్థానమునకు బయటకి వచ్చెదరు. **(బైబిల్ 5:28-29)**

మనిషి మరణించిన తరువాత తీర్పు దినాన అతనికి తిరిగి రెండవసారి జీవితాన్ని ప్రసాదిస్తాడు ఆ విశ్వ ప్రభువు అల్లాహ్. ఎందుకంటే! ప్రతి మనిషి ఇహ లోకంలో చేసుకున్న మంచి, చెడు కార్యాలకు దైవ (అల్లాహ్) సన్నిధిలో నిలబడి సమాధానం చెప్పుకోవటానికి.

ఏమిటి, నేను చనిపోయిన తరువాత, మళ్ళీ నన్ను బ్రతికించటం నిజంగానే జరుగుతుందా? అని అంటాడు మనిషి. అసలు అతడు ఏమీ కానప్పుడే మేము (అల్లాహ్) అతనిని సృష్టించామన్న విషయం అతడికి జ్ఞాపకం

రావటం లేదా? నీ ప్రభువు సాక్షిగా! మేము వారందరిని, వారితో పాటు షైతానులను కూడా తప్పకుండా పోగు చేస్తాము. **(ఖుర్‌ఆన్ 19:66-67)**

మేము మానవుని ఎముకలను జత చేయలేమని అతడు అనుకుంటున్నాడా! ఎందుకు జత చేయలేదు?మేమ అతని వ్రేళ్ల కొనలను సైతం సముచితమైన రీతిలో రూపొందించగల సమర్థులం. (ఖుర్‌ఆన్ 75 : 2 - 3)

## ఈ కార్యం ఎవరి ద్వారా సాధ్యమౌతుంది?

వారు ఇలా అంటారు, మేము ఎముకలుగా, మట్టిగా మారి పోయినప్పుడు సరికొత్తగా సృష్టింపబడి లేవబడతామా? వారితో ఇలా అను "మీరు రాయిగా గాని ఇనుముగా గాని మారి పోయినా లేదా తిరిగి బ్రతికింపబడి లేపబడటానికి అసాధ్యమైనదని మీరు భావిస్తున్నటు వంటి వాటి కంటే కూడా ఎక్కువ కఠినమైనటువంటి వస్తువుగా మారిపోయినా సరే (మీరు లేచి తీరుతారు) వారు తప్పకుండా ఇలా అడుగుతారు. మమ్మల్ని మళ్లీ బ్రతికించి లేపగలవాడు ఎవడు? సమాధానంగా ఇలా అను. మిమ్మల్ని మొదటిసారి పుట్టించిన వాడే. **(ఖుర్‌ఆన్ 17 : 49-51)**

**నోట్:** మొదటిసారి మనందరిని ఏ దేవుడు పుట్టించాడు?

ఎలా పుట్టించాడు అనే సత్య విషయాలు మనము ఇదివరకే తెలుసుకున్నాము. ఇక సత్యం తెలుసుకున్నాక మనమందరం ఏం చెయ్యాలి? సత్యాన్ని స్వీకరించాలా లేక గాలికి వదిలేయాలా? అసలు సత్యం ఉన్నది దేనికోసం? కేవలం తెలుసుకోవడానికేనా? లేక ఆచరించటానికా?

## జన్మల చక్రం ఆవాస్తవం

చివరకు మీలో ఎవరికైనా మరణ సమయం ఆసన్నమైనప్పుడు ఆయన పంపిన దూతలు అతని ప్రాణం తీసుకుంటారు. తమ కర్తవ్యనిర్వహణలో వారు ఏమాత్రం అజాగ్రత్త చూపరు. మళ్ళీ వారంతా తమ నిజమైన ప్రభువు, అల్లాహ్ సన్నిధికి మరలింపబడతారు. తెలుసుకోండి, తీర్పు చేసే సర్వాధికారాలు ఆయనకే ఉన్నాయి. లెక్కను తీసుకోవటంలో ఆయన వడిగలవాడు. **(ఖుర్ఆన్ 6: 62)**

హిందూ మత పండితుల దగ్గర అపార్థానికి గురైన గీతలోని ఒక శ్లోకం "జన్మించినవాడు మరణించక తప్పదు-మరణించిన వాడు జన్మించక తప్పదు." (సాంఖ్య యోగము (గీత 2: 27) ఈ శ్లోకాన్ని మత పండితులు తీసుకున్న అర్థం ఏమిటంటే! మరణించినవాడు జన్మించక తప్పదు అంటే.... మనిషి చనిపోయినప్పటికీ మళ్లీ కొత్తగా

ఇక్కడే(ఇహలోకంలో) జన్మించడం, ఒక వేళ మనిషి సత్కార్యాలు చేసుకుంటే మళ్ళీ మానవ జన్మ ఎత్తుతాడని (అంటే మళ్ళీ తల్లి గర్భంలో నుంచి పుట్టడం) ఒక వేళ మనిషి పాప కార్యాలు చేసుకుని చనిపోతే అతడు క్రిమి కీటకాలుగా ఇంకా కుక్క, పిల్లి, నక్క, పంది ఇలా జంతువుల రూపంలో జన్మ ఎత్తుతాడని ఒక తప్పుడు భావన కొన్ని యుగాల నుండి ప్రచారంలో ఉన్నది. సోదరులారా! ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి అదేమిటంటే- ప్రస్తుతం మన సమాజంలో పాపాత్ములు ఎక్కువగా ఉన్నారా? లేక పుణ్యాత్ములు ఎక్కువగా ఉన్నారా? మీరు ఖచ్చితంగా పాపాత్ములే అంటారు. ఎందుకంటే పాపాత్ముల కారణంగానే నేడు సమాజంలో పాపాలు ఎక్కువ అయ్యి అశాంతి చోటు చేసుకుంది. అలాంటప్పుడు మన సమాజంలో కుక్కలు, నక్కలు, పిల్లులు, పందుల సంఖ్య కూడా ఎక్కువ ఉండాలి కదా! మరి అలా ఎందుకు జరగటం లేదు? ఎందుకంటే! పునర్జన్మల సిద్ధాంతం వేదాల ప్రకారం కాని, బైబిల్ ప్రకారం కాని అలాగే మానవాళి అందరి కోసం పంపబడినటువంటి చిట్ట చివరి దైవ చట్టం (ధర్మ శాస్త్రం) ఖుర్‌ఆన్ ప్రకారం కాని లేనే లేదు.

ఈ ప్రజలు ఇలా అంటారు; “మేము మట్టిలో కలిసి

నశించిపోయిన, మళ్ళీ వేము కొత్తగా సృష్టింప బడతామా?" అసలు విషయం ఏమిటంటే వారు తమ ప్రభువును కలుసుకోవటాన్ని తిరస్కరిస్తారు. వారితో ఇలా అను, "మీపై నియమింపబడిన మృత్యుదూత మిమ్మల్ని పూర్తిగా కైవసం చేసుకుంటాడు, తరువాత మీరు మీ ప్రభువు వైపునకు మరలింపబడి తీసుకుపోబడతారు."

(ఖుర్ఆన్ 32: 10-11)

**పునర్జన్మల సిద్ధాంతం గురించి మేధావుల అభిప్రాయాలు**

వేదాలలో పునర్జన్మ సిద్ధాంతం లేదు. లభించదు.

డాక్టర్ సర్వేపల్లి రాధకృష్ణన్

**(ఇండియన్ ఫిలాసఫి నెం.1వ గ్రథం పేజి 113 - 116)**

వేదాలలో పునర్జన్మ సిద్ధాంతం అనేది లేదు. ఈ విషయం గురించి నేను జూదం కూడా ఆడగలను.

**(పునర్జన్మ గ్రంథం- రచయిత: సత్యార్ధ విద్యాలంకార్ - పేజి. 104)**

వేదాలలో పునర్జన్మ సిద్ధాంతం అనేది లేదు. అందులో పరలోక వాదమే లభిస్తుంది. **(మాక్స్ ముల్లర్)**

**(ప్రాచ్య మతాల ప్రఖ్యాత అధ్యయన కర్త)**

# స్వర్గ- నరకాలు

## స్వర్గం ఎవరి కోసం?

వారిని అడగండి, ఈ పర్యవసానం మంచిదా లేక శాశ్వతంగా ఉండే స్వర్గం మంచిదా అని ఆ స్వర్గం దైవభీతి కలవారికి వాగ్దానం చేయబడింది, అది వారి కర్మలకు ప్రతిఫలం. వారి ప్రయాణానికి చివరి గమ్య స్థానం, అందులో వారి ప్రతి కోరికా తీరుతుంది. అందులో వారు శాశ్వతంగా ఉంటారు. దానిని ప్రసాదించడం అనేది నీ ప్రభువు తప్పని సరిగా నెరవేర్చవలసిన ఒక వాగ్దానం.

(ఖుర్ఆన్ 25: 15-16)

## స్వర్గం ఎలా ఉంటుంది?

బంగారు జలతారుతో అల్లిన ఆసనాలపై దిండ్లకు ఆనుకొని ఎదురెదురుగా కూర్చుని (స్వర్గవాసులు) ఉంటారు. వారి సమావేశాలలో నిత్యం బాల్యం కల బాలురు, మధువు ప్రవహించే చెలమ నుండి నింపిన మధు పాత్రలు; గిన్నెలు, గాజు పాత్రలు కూజాలు తీసుకొని పరుగుతో తిరుగుతూ ఉంటారు. దానిని త్రాగటం వల్ల వారి తల తిరగటం కాని వారికి బుద్ధి మాంద్యం కలగటం గాని జరగదు. వారు వారి ముందు రకరకాల రుచికరమైన పండ్లను ఉంచుతారు.

ఇష్టమైన దానిని తీసుకోవటానికి; పక్షుల మాంసాన్ని ఉంచుతారు. ఏ పక్షిమాంసం ఇష్టమైతే అది తినాలని; వారి కొరకు అందమైన కళ్ళుగల 'హూర్'లు (రమణీమణులు) ఉంటారు. వారు దాచి పెట్టిన ఆణిముత్యాల మాదిరిగా ఎంతో అందంగా ఉంటారు. ఇదంతా వారు ప్రపంచములో చేస్తూ వచ్చిన కర్మలకు ప్రతిఫలంగా వారికి లభిస్తుంది. అక్కడ వారు పనికి మాలిన విషయాలు గాని, పాప విషయాలు గాని వినరు. ఏ మాట అయినా సరే, సరిగానే, సవ్యముగానే ఉంటుంది. **(ఖుర్ఆన్ 56:12-26)**

**నోట్:** ముహమ్మద్ (స) ప్రవక్త ఉల్లేఖనాల ప్రకారం: 1) స్వర్గంలో ఒకొక్క స్వర్గవాసి వయస్సు 33 సం॥లు ఉంటుంది. 2) ఒకొక్క స్వర్గవాసికి అల్లాహ్ 100 మంది పురుషుల బలాన్ని బహూకరిస్తాడు.

## నరకం ఎవరి కోసం?

గ్రంథ ప్రజలలో, బహుదైవారాధకులలో సత్యాన్ని తిరస్కరించినవారు తప్పనిసరిగా నరకాగ్నిలోకి పోతారు. అందులోనే శాశ్వతంగా ఉండిపోతారు. వారు సృష్టిలో కెల్లాపరమనీచులు. **(ఖుర్ఆన్ 98: 6)**

## నరకం ఎలా ఉంటుంది?

జఖ్ఖూమ్ (రాకాసి జముడు) వృక్షం పాపాత్ములకు ఆహారం అవుతుంది. అది నూనె మడ్డిలాగా ఉంటుంది. సలసల కాగే నీరు మాదిరిగా అది కడుపులో మసులుతూ ఉంటుంది. అతనిని పట్టుకోండి, నరకం మధ్యకు ఈడ్చుకుంటూ తీసుకు వెళ్ళండి, వాడి తల మీద సలసల కాగె నీటి శిక్షను బొర్లించండి. నీవు గొప్ప బలవంతుడవూ, గౌరవనీయుడవూ అయిన మనిషివి. మీరు ఏ విషయం రాకను గురించి సందేహించేవారో, ఆ విషయం ఇదే.

**(ఖుర్ఆన్ 44:43-50)**

ప్రశ్న . భయంకరమైన నరక శిక్ష నుంచి రక్షించ బడాలంటే అతను ఇహలోకంలో ఏమి చేయవలెను?

జ. సృష్టి పూజకు దూరంగా ఉండి కేవలం సృష్టికర్తను మాత్రమే విశ్వసించి సత్కార్యాలు చేయవలెను.

ప్రశ్న. సృష్టికర్త ఎవరు?

జ. భూమిని, ఆకాశాలను, వాటి మధ్య ఉన్న సమస్త సృష్టిని తన అద్భుత శక్తి ద్వారా ఆరు రోజులలో సృష్టించి, సృష్టి వ్యవహారాలను నడుపుతున్న ఆ సృష్టికర్తనే అల్లాహ్ అంటారు.

ప్రశ్న. అల్లాహ్ అంటే కేవలం ముస్లిం ల దేవుడేనా?

జ. అల్లాహ్ మానవులందరికీ ప్రభువు, పాలకుడు, పోషకుడు వాస్తవానికి ఆయన తప్ప మరొక దేవుడు లేడు.

ఈ ప్రాపంచిక జీవితం ఒక క్రీడ, ఒక వినోదం తప్ప మరేమీకాదు. అసలు జీవన గృహం పరలోక గృహమే. అయ్యో! వారు (ఈ విషయాన్ని) తెలుసుకుంటే ఎంత బాగుంటుంది. **(ఖుర్ఆన్ 29: 64)**

## ఇస్లాం పరిచయం

అల్లాహ్యే తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్ని, సత్య ధర్మాని ఇచ్చి పంపాడు. అది అన్ని ధర్మాలపై ఆధిక్యంకలిగి ఉండేలా చేయుటానికి. ఈ వాస్తవానికి అల్లాహ్ సాక్ష్యంచాలు. **(ఖుర్ఆన్ 48 : 28)**

గత గ్రంథాలలో మనిషి మోక్షానికి దేవుడు ఏ ధర్మాన్ని అయితే, బోధించాడో అదే ధర్మాన్ని అరబ్బీ భాషలో ఇస్లాం (శాంతి)అని అంటారు. సృష్టికర్త అయిన అల్లాహ్ ఆజ్ఞ ప్రకారం జీవితాన్ని గడిపి ఆయనకు విధేయత చూపి ఆయనకే సమర్పించుకుని శాస్త్రబద్ధంగా జీవించడాన్నే ఇస్లాం అంటారు. అలా చేసే వ్యక్తిని ముస్లిం(దైవ విధేయుడు) అని అంటారు. ఆది మానవుడు ఆదమ్ (అ.స) నుండి దేవుడు వివిధ గ్రంథాల ద్వారా వివిధ ప్రవక్తల ద్వారా

మానవాళికి బోధించిన ధర్మమే ఇస్లాం. దీనిని సృష్టికర్త (అల్లాహ్) తన చివరి ప్రవక్త ముహమ్మద్ (స) పైన పరిపూర్ణం చేశాడు.

## ముహమ్మద్ (స) అందరి ప్రవక్త

గత ప్రవక్తలు ఒక ప్రత్యేక జాతికో, ప్రత్యేక కాలానికో పంపబడ్డారు. కాని ముహమ్మద్ (స) ప్రవక్త సకల మానవజాతికి ప్రవక్తగా చేసి పంపబడ్డారు.

ఓ ప్రవక్త ముహమ్మద్ (స)! మేము (అల్లాహ్) నిన్ను సకల మానవజాతికీ ప్రవక్తగా చేసి పంపాము దీనికి అల్లాహ్ సాక్ష్యం చాలు. **(ఖుర్ఆన్ 4:79)**

ముహమ్మద్ (స) ప్రవక్త కేవలం ముస్లింల ప్రవక్త మాత్రమే కాదు. మనందరికోసం సృష్టికర్త(అల్లాహ్) సందేశాన్ని తెచ్చిన అంతిమ దైవప్రవక్త. ఈయన రాకకు పూర్వమే వేద వేదాంగాలు ఆయన వస్తారని పేరుతో సహా తెలియజేసాయి.

## వేదాలలో ముహమ్మద్(స)

వేదాలలో మహనీయ ముహమ్మద్(స) గురించి అనేక చోట్ల 'నరాశంసః' పేరుతో ప్రస్తావించడమైనది.

నరాశంసః యో సరౌ ప్రశస్యతే : ఏ మానవుడైతే ప్రశంసింప బడుతాడో, సాయణ్ భాష్య, ఋగ్వేదసంహిత, (5-5-2) ఇది కర్మాధారయ సమానము. దీని అర్థం ప్రశంసింపబడే మానవుడు ముహమ్మద్ అనే అరబీ పదం యొక్క అర్థం కూడా ఇదే.

ఋగ్వేదం: 1వ మండలం-13వ సూక్తం - 3వ మంత్రం

2వ మండలం-3వ సూక్తం - 2వ మంత్రం

5వ మండలం-5వ సూక్తం - 2వ మంత్రం

7వ మండలం-2వ సూక్తం - 2వ మంత్రం

10వ మండలం-64వ సూక్తం - 3వ మంత్రం

ఇదం జనా ఉప శ్రుత నరాశంసప స్తవిష్యతే షష్టిం సహస్ర నవతిం చ  కౌరమ ఆ రుషమేఘు దద్మహే॥

ఓ ప్రజలారా! శ్రద్ధగా వినండి నరాశంస ముహమ్మద్ (స) ప్రశంసింపబడతారు. 60 వేల తొంబై శత్రువుల మధ్య ఆయనను మనము పొందుతాము.

**(అధర్వణ వేదం 20వ కాండం-127వ సూక్తం 1వ మంత్రం)**

అహమది పితూహు పరమేధా మృతస్య జాగ్రణి అహం సూర్యో ఇవాజన:

(సామవేదం: ప్రతిసర్గ పర్వం అధ్యాయం6, మంత్రం 8)

అర్థం: అహమద్ అనే అతను తన ప్రభువు నుండి ధర్మశాస్త్రం (ఖుర్ఆన్) పొందారు. ఆయన ప్రవక్తలకు తండ్రి లాంటివాడు. ఆ ధర్మశాస్త్రం ఎంతో జ్ఞానపూరితమైనది, సూర్యుని కాంతిలాగా ఆయన వెలుగును పొందాడు.

కేవలం వేదాలలోనే కాకుండా పురాణాలలో కూడా మహనీయం ముహమ్మద్(స) వారి పేరుతో సహా ప్రస్తావించబడింది.

ఏ తస్మిన్నన్తరే మ్లేచ్ఛ ఆచార్యేణ సమన్వితః

మహామద ఇతి ఖ్యాత శిష్యశాఖా సమన్వితః

నృపశ్చైత మహాదేవం మరుస్తల నివాసినమ్.

ఒక మ్లేచ్ఛుడు (నిరక్షరాస్యుడు) పరదేశస్థుడైన ఒక బోధకుడు తన శిష్యులతో పాటు వస్తాడు. ఆయన పేరు ముహమ్మద్ అయి ఉంటుంది. ఆయన ఎడారి ప్రాంతానికి చెందినవారై ఉంటారు.

**(భవిష్య పురాణం ప్రతిసర్గ పర్వం 3: అధ్యాయం 3 ఖాండం 3 శ్లోకం 5-8)**

ఆయన లింగచ్ఛేది (సున్నతి ఒడుగులు) తలపై ముడి

ఉండదు. గడ్డం పెంచుకొని ఉంటారు. మాంసహారి. బిగ్గరగా గొంతెత్తి మాట్లాడతారు. ముసలై (ముస్లిం) గా పరిచయం అవుతారు.

**(భవిష్య పురాణం ప్రతి సర్గపర్వం 3 అధ్యాయం 3 ఖాండం 3 శ్లోకం 25-27)**

బుద్ధ గ్రంథాలలో కూడా మహనీయ ముహమ్మద్ (స) వారి గురించి ప్రస్తావించబడింది. "నందా! ఈ ప్రపంచంలో నేనే మొదటి మరియు చివరి బుద్ధుణ్ణికాను. నా తరువాత కూడా బుద్ధులు వస్తారు. ప్రపంచానికి స్వచ్ఛమైన సంపూర్ణమైన జీవిత విధానాన్ని తెలియజేసే బుద్ధుడు కూడా రానున్నాడు. ఓ నందా ఆయన "మైత్రేయుడు".

**(గ్రాస్‌పెల్ ఆఫ్ బుద్ధా, కారుస్ పే॥ 217)**

ఇదే విధంగా జైనమత గ్రంథాలలో కూడా మహనీయ ముహమ్మద్ (స) వారి గురించి ప్రస్తావించబడింది. మహావీర్ జైన్ మరణించిన 1000 సం॥ తరువాత అంతిమ ఋషి జన్మింస్తాడని పేర్కొనడమైనది. మహావీర్ జైన్ క్రీ॥పూ॥ 571 లో మరణించారు. మహనీయ ముహమ్మద్ (స) క్రీ॥శ॥ 571 లో జన్మించారు.

## బైబిల్ లో ముహమ్మద్ (స)

**యహోవా, మోషేతో....**

వారి సహోదరులలో నుండి నీవంటి ప్రవక్తను వారి కొరకు పుట్టించెదను. అతనినోట నా మాట ఉంచుదును. నేను అతని ఆజ్ఞాపించునది యావత్తును అతడు వారితో చెప్పును. అతడు నా నామమున చెప్పు నా మాటలను వినని వానిని దాని గూర్చి విచారణ చేసెదను.

(బైబిల్ ద్వితీయోపదేశకాండము 18:18)

**నోట్:** మోషే వారి జీవితాన్ని, ప్రవక్త ముహమ్మద్ (స) వారి జీవితాన్ని పరిశీలిస్తే ముహమ్మద్ (స) వారే మోషేవంటి ప్రవక్త అని మనకు స్పష్టంగా అర్థం అవుతుంది.

యేసు వారు తన తరువాత మరో ఆదరణకర్త వస్తారని ప్రవచించారు.

అయితే నేను సత్యము చెప్పుచున్నాను. నేను వెళ్లిపోవుటవలన మీకు ప్రయోజనకరము. నేను వెళ్ళని యెడల ఆదరణ కర్త మీ యొద్దకు రాడు. నేను వెళ్ళిన యెడల ఆయనను మీ యొద్దకు పంపుదును.

(బైబిల్ యోహాను 16:7)

ఆయన సమస్తమును మీకు బోధించును... నన్ను గురించి సాక్ష్యమిచ్చును. నేను వెళ్ళని యెడల ఆయన రాడు

నేను వెళ్ళి ఆయనను పంపుదును. ఆయన మిమ్మల్ని సర్వ సత్యములోనికి నడిపించును...ఆయన తనంతటఅ తాను ఏమియూ బోధింపక వేటిని వినునో వాటిని బోధించి జరుగబోవు సంగతులు చెప్పును.

(బైబిల్ యోహాను 16:14-16)

**ఖుర్ఆన్ సాక్ష్యం:** అతను ముహమ్మద్ (స) తన మనోవాంఛలను అనుసరించి చెప్పటంలేదు ఇది ఒక వహీ

| **ముస్లిం సోదరుల విశ్వాసం ప్రకారం మోషే వంటి ప్రవక్త ముహమ్మద్ (స) వారే** | | |
|---|---|---|
| **మోషే ప్రవక్త** | **ముహమ్మద్ (స)** | **యేసుప్రవక్త** |
| తల్లిదండ్రుల ద్వారా జన్మించారు | తల్లిదండ్రుల ద్వారా జన్మించారు | తండ్రి లేకుండానే జన్మించారు |
| వివాహం చేసుకున్నారు | వివాహం చేసుకున్నారు | వివాహం కాలేదు |
| సంతానం కలిగింది | సంతానం కలిగింది | సంతానం కలగలేదు |
| సహజ మరణం | సహజ మరణం | అల్లాహ్ తనవైపునకు సజీవంగా లేపుకున్నాడు |

(దైవవాణి) అతని పై అవతరింప చేయబడుతుంది. గొప్ప

శక్తి సంపన్నుడు అతనికి నేర్పుతున్నాడు.

**(ఖుర్ఆన్ 53 : 2-3)**

**నోట్:** యేసు వారి తర్వాత సుమారు 570 సం॥లకు ఆయనలాగే ఏకేశ్వర సిద్ధాంతాన్ని బోధించిన ప్రవక్త ముహమ్మద్ (స) ఒక్కరే!

ఈ విధంగా వేద వేదాంగాలు మరియు బైబిల్ ముహమ్మద్ (స) గురించి ముందుగానే పేరుతో సహా తెలియజేశాయి. ఆయన మానవులందరికి ప్రవక్త. ఆయనను అనుసరించడం మన కర్తవ్యం.

(మానవులారా) ముహమ్మద్ (స) మీలో ఏపురుషునికీ తండ్రి కాదు. కాని ఆయన అల్లాహ్ యొక్క ప్రవక్త **దైవప్రవక్తల పరంపరను సమాప్తం చేసే చివరి వారు.** అల్లాహ్ సకల విషయాల జ్ఞానం కలవాడు. **(ఖుర్ఆన్ 33 : 40)**

## ఇకనైనా మేల్కొనండి!

సోదర మహాశయులారా! ధార్మిక గ్రంథాల వెలుగులో సత్య సందేశాన్ని మీ ముందు తీసుకురావడం జరిగింది.

సత్య సందేశాన్ని చదివిన తరువాత కూడా ఏమి ఎరగని వారిలా ఉండకండి. ఎవరు - ఎవరిని పూజించి నప్పటికీ దేవుడు మాత్రం అందరికీ ఒక్కడే మేము రామ్

అంటాము మీరు రహీమ్ అంటారు. మార్గాలు వేరైనా గమ్య స్థానం మాత్రం ఒక్కటే అని తేలిగ్గా కొట్టి పడవేయకండి. ఎందుకంటే సత్య సందేశాన్ని ఎలాంటి దాగుడుమూతలు లేకుండా చాలా స్పష్టంగా మీ ముందుకు తీసుకురావడం జరిగింది.

రేపు (అంటే) తీర్పు దినాన సృష్టికర్త అయిన అల్లాహ్ సమక్షంలో - మాకు స్పష్టంగా సందేశాన్ని అందిచే వారు ఇహలోకంలో ఎవరూ రాలేదు అని మీరు అనగలగకుండా ఉండాలని. సోదరులారా ఇప్పటికైనా సమయం మించిపోలేదు ఇకనైనా కళ్ళు తెరవండి సత్యాన్ని గ్రహించండి. కళ్ళు వున్నవాడు, గుడ్డివాడు ఇద్దరూ సమానులు ఎలా కాలేరో అలాగే సృష్టి అంతటిని సృష్టించినవాడు,... సృష్టిలో ఏ వస్తువును కూడ సృష్టించనివాడు ఇద్దరూ సమానులు కాలేరు కదా! కావున సృష్టికర్త అయిన అల్లాహ్ వైపునకు పశ్చాత్తాప మనసుతో మరలండి. ఋజుమార్గం కోసం ఆయనను మాత్రమే వేడుకోండి. అల్లాహ్ తన వైపునకు మరలే వానికి మాత్రమే తన వైపునకు వచ్చే మార్గాన్ని చూపుతాడు.

## క్రైస్తవ సోదరులకు - ఖుర్ఆన్ సందేశం

గ్రంథ ప్రజలారా! మీ ధర్మవిషయాలలో అతిగా ప్రవర్తించకండి. అల్లాహ్‌కు సత్యంతప్ప వేరే విషయాన్ని ఆపాదించకండి. మసీహ్, మర్యమ్ కుమారుడు ఈసా, అల్లాహ్ పంపిన ఒక ప్రవక్త, అల్లాహ్ మర్యమ్ వైపునకు పంపిన ఒక ఆజ్ఞ, అల్లాహ్ తరఫునుండి వచ్చిన (మర్యమ్ గర్భంలో బిడ్డ రూపందాల్చిన) ఒక ఆత్మ తప్ప మరేమీకాదు. కనుక అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తలను విశ్వసించండి. **'ముగ్గురు' అని అనకండి. ఇలా అనటం మానివేయండి.** ఇది మీకే శ్రేయస్కరం. అల్లాహ్ ఒక్కడే దేవుడు. ఆయన పరిశుద్ధుడు. ఆయనకు ఒక కొడుకు ఉన్నాడనే విషయానికి ఆయన అతీతుడు. భూమ్యాకాశలలో ఉన్న సమస్తమూ ఆయన ఆస్తియే. దాని పోషణకు, దాని రక్షణకు ఆయనే చాలు. **(ఖుర్ఆన్ 4:171)**

## క్రైస్తవ సోదరులారా!

దైవధర్మాన్ని మరచి, అజ్ఞానములో కొట్టు మిట్టాడుతూ దురాచారం మరియు అంధాకారపు జీవన విధానానికి బానిస అయిన దైవదాసుల జీవితాలలో మరోసారి వెలుగు నింపడానికి ఆ దైవం పంపిన కాంతివంతమైన దీపం పేరే ముహమ్మద్(స). క్రీస్తు శకం ముగిసిన సుమారు 570

సం॥ల తరువాత సకల దైవ ప్రవక్తలు తీసుకొని వచ్చిన సనాతన (ఇస్లాం) ధర్మాన్నే ముహమ్మద్ (స) ప్రవక్త పరిచయం చేశారు.

**దేవుని సకల ప్రవక్తలు పరిచయం చేసిన ధర్మం ఇస్లాం.**

ఆయన నూహ్ ప్రవక్తకు ఆజ్ఞాపించిన ధర్మాన్నే నీకు కూడా నిర్ణయించాడు. దానినే (ముహమ్మద్ స) ఇప్పుడు నీ వైపునకు మేము వహీ (దైవవాణి) ద్వారా పంపాము: దానినే వేము ఇబ్రాహీమ్‌కు, మూసాకు, ఈసాకు బోధించాము: ఈ ధర్మాన్ని స్థాపించండని, దానిని గురించి విభేదాలకు లోనుకాకండి అని తాకీదు చేస్తూ, ఈ విషయమే ఈ బహుదైవారాధకులకు ఎంతో అసహనం కలిగించింది. దాని వైపునకే ముహమ్మద్ (స) నీవు వారిని ఆహ్వానిస్తున్నావు. అల్లాహ్ తానుకోరిన వారిని తన వారుగా చేసుకుంటాడు. ఆయన తన వైపునకు మరలేవారికి మాత్రమే తన వైపునకు వచ్చే మార్గాన్ని చూపుతాడు. **(ఖుర్ఆన్ 42: 13)**

గ్రంథ ప్రజలారా! ప్రవక్తల ఆగమన క్రమం ఎంతో కాలంగా ఆగిపోయి ఉన్నప్పుడు మా ఈ ప్రవక్త (ముహమ్మద్)(స) మీ వద్దకు వచ్చాడు. మీకు స్పష్టమైన ధర్మోపదేశాలను అందజేస్తున్నాడు. మా వద్దకు శుభవార్త

తెలిపేవాడు హెచ్చరికలు చేసేవాడు ఎవడూ రాలేదు అని మీరు అనగలగకుండా ఉండాలని. కనుక చూడండి! ఆ శుభవార్త తెలిపేవాడు, హెచ్చరికలు చేసే వాడు ఇప్పుడు విచ్చేశాడు- అల్లాహ్ ప్రతి వస్తువుపై అధికారం కలవాడు. (ఖుర్ఆన్5:19)

**మర్యమ్ కుమారుడు ఈసా (అ.స) ఇచ్చిన సాక్ష్యం...**

(ఈసా ఇలా ప్రకటించారు) "నాకూ, మీకూ ప్రభువు అల్లాహ్‌యే. కనుక మీరు ఆయనకే దాస్యం చేయండి. ఇదే ఋజుమార్గం" **(ఖుర్ఆన్ 19:36)**

**మర్యమ్ కుమారుడు ఈసా (అ.స) నేనే దేవుడని ప్రకటించారా?**

మర్యమ్ కుమారుడైన ఈసా! నీవు మనుజజాతితో, అల్లాహ్‌ను కాదని నన్ను, నా తల్లిని దేవుళ్ళుగా భావించండి అని బోధించావా? అని అడిగినప్పుడు అతను ఇలా మనవి చేసుకుంటాడు: నీవు అత్యంత పవిత్రుడవు! ఏ మాటను అనే హక్కు నాకు లేదో ఆ మాటను అనటం నాకు యుక్తమైన పని కాదు. ఒక వేళ నేను ఆ విధంగా అని ఉంటే, అది నీకు తప్పకుండా తెలిసిఉండేది. నా మనసులో ఏముందో నీకు తెలుసు, నీ మనసులో ఏముందో నాకు తెలియదు.

నీవు గుప్తముగా ఉన్నా యదార్థాలన్ని తెలిసిన మహా జ్ఞానివి. నీవు ఆదేశించిన దానిని తప్ప దేనిని నేను వారికి చెప్పలేదు. అదేమిటంటే అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన నాకు ప్రభువే, మీకు ప్రభువే. **(ఖుర్‌ఆన్ 5:116)**

## మర్యమ్ కుమారుడైన ఈసా (అ.స) ను పూజిస్తే కలిగే పర్యవసానం?

మర్యమ్ కుమారుడైన మసిహ్‌యే అల్లాహ్ అని అన్నవారు నిశ్చయంగా అవిశ్వాసానికి పాల్పడినట్లే. వాస్తవానికి మసీహ్ ఇలా అన్నాడు: ఇస్రాయీలు వంశీయులారా! అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. ఆయన నాకూ ప్రభువే మీకూ ప్రభువే. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసేవారికి అల్లాహ్ స్వర్గాన్ని నిషిద్ధం చేశాడు. వారి నివాసం నరకం. అటువంటి దుర్మార్గులకు సహాయం అందించే వాడెవడూ లేడు. **(ఖుర్‌ఆన్ 5: 72)**

## యూదులు మర్యమ్ కుమారుడైన ఈసా(అ.స) ను శిలువ పై ఎక్కించారా?

వారు (యూదులు) తమ అవిశ్వాసంలో ఎంత ముందుకు పోయారంటే, మర్యమ్ పైనే తీవ్రమైన నిందమోపారు. స్వయంగా “మేము మసీహ్, మర్యమ్

కుమారుడైన ఈసా అనే దైవప్రవక్తను చంపాము" అని అన్నారూ - **వాస్తవానికి వారు ఆయనను చంపనూలేదు, శిలువ పైకి ఎక్కించనూ లేదు. కాని ఈ విషయంలో వారు భ్రమకు గురిచెయ్యబడ్డారు.** ఈ విషయం గురించి అభిప్రాయభేదం వ్యక్తం చేసిన వారు కూడా సందేహానికి లోనయ్యారు. దీనిని గురించి వారికి అసలు ఏమీ తెలియదు. వారు కేవలం ఊహనే అనుసరిస్తున్నారు. వారు అతనిని నిశ్చయంగా చంపలేదు. కాని అల్లాహ్ ఆయనను తన వైపునకు లేపుకున్నాడు. అల్లాహ్ అద్భుత శక్తి సంపన్నుడు, అత్యంత వివేకవంతుడు. **(ఖుర్ఆన్ 4: 156-158)**

**వివరణ:** క్రైస్తవ సోదరుల సమస్త ముఖ్య విశ్వాసాలను ఖుర్ఆన్ ఖండిస్తుంది అంటే దేనికి? ఆలోచన ఎంతో అవసరం. ఎందుకంటే ఖుర్ఆన్ అవతరించక పూర్వం నుంచే యేసు వారి పట్ల క్రైస్తవులు రకరకాల విభిన్న విశ్వాసాలు కలిగి ఉన్నారు. వారిలో ఉన్నటు వంటి తప్పుడు విశ్వాసాలను సరిచేసేటందుకు గాను, మరియు వారిలో ఉన్నటు వంటి భేదాభిప్రాయాలను తొలగించటానికి వచ్చినటు వంటి చివరి దైవగ్రంథమే ఖుర్ఆన్

**బలమైన ఉదాహరణలు :-**

**1. భూమి, ఆకాశాలలో అగోచర జ్ఞానం కలవాడు కేవలం అల్లాహ్ (సృష్టికర్త) మాత్రమే.**

**2. ముహమ్మద్ (స) ప్రవక్త చదవటం వ్రాయటం రాని నిరక్ష్యరాస్యుడు.**

**3. ఆదము నుండి ఈసా ప్రవక్త వరకు ప్రవక్తలు ఎవరైతే వచ్చారో ... ఆయా కాలలో ముహమ్మద్ (స) ప్రవక్త లేకుండెను.**

మరి అలాంటప్పుడు దైవ ప్రవక్తలందరి జీవిత గాధలు ఉన్నవి ఉన్నట్లుగా ముహమ్మద్ (స) ప్రవక్త బోధించారంటే ఆయనకు ఆ జ్ఞానం ఎక్కడి నుండి లభించినది???

ప్రవక్తా! ఇవన్నీ అగోచర విషయాలకు సంబంధించిన వార్తలు. వాటిని మేము నీకు వహీ (దైవవాణి) ద్వారా తెలుపుచున్నాను. లేకపోతే, మర్యమ్ సంరక్షకుడు ఎవరు అవ్వాలి అనే విషయ నిర్ణయం కొరకు, ఆలయ సేవకులు తమ తమ కలములను విసిరినప్పుడు నీవు (ముహమ్మద్)(స) లేవుకదా! ఇంకా, వారిమధ్య వివాదం చెలరేగినప్పుడు కూడా నీవు అక్కడ లేవు. **(ఖుర్ఆన్ 3:44)**

అంటే! ఏ విషయాలనైతే అల్లాహ్, వహీ (దైవవాణి) ద్వారా ముహమ్మద్ (స) ప్రవక్తకు తెలిపాడో... ఆ విషయాలనే

ముహమ్మద్ (స) ప్రవక్త యావత్ మానవాళికి ఆ అల్లాహ్ సందేశాన్ని అందజేశారు.

దీని ద్వారా తెలిసిన విషయమేమిటంటే! అగోచర జ్ఞానం లేని మరియు చదవటం, వ్రాయటం రాని నిరక్షరాస్యుడైన ముహమ్మద్(స) ప్రవక్త ఖుర్ఆన్ గ్రంథాన్ని రచించలేదు.

ఇది సకల లోకాల ప్రభువు అవతరింపజేసినది. దీనిని తీసుకొని విశ్వసనీయమైన ఆత్మ నీ హృదయ ఫలకంపై అవతరించినది. **(ఖుర్ఆన్ 26:192)**

## ఖుర్ఆన్....విశ్వ ప్రభువు అయిన అల్లాహ్ గ్రంథం

వేము మా దాసుని (ముహమ్మద్) (స) పై అవతరింపజేసిన గ్రంథం (ఖుర్ఆన్) గురించి, అది మా గ్రంథం అవునో కాదో అని మీకు సందేహం ఉన్నట్లయితే దానివంటి ఒక్క సూరానైనా మీరు రచించుకొని తీసుకురండి. మీ సహచరులందరినీ పిలుచుకోండి. ఒక్క అల్లాహ్ తప్ప మరెవరి సహాయాన్నయినా పొందండి. మీరు సత్యవంతులే అయితే ఈ పనిచేసి చూపించండి. కాని మీరు అలా చెయ్యకపోతే- నిశ్చయంగా ఎన్నటికీ చెయ్యలేరు-భయపడండి, మానవులు, రాళ్ళు, ఇంధనం

కాగల ఆ అగ్నికి అది సత్యతిరస్కారుల కొరకు తయారు చెయ్యబడింది. **(ఖుర్‌ఆన్ 2 : 23, 24)**

కాదు, అదికాదు, మీరు చూస్తున్న వస్తువులమీద, మీరు చూడలేని వస్తువులమీద ప్రమాణం చేసి చెప్తున్నాను; ఇది గౌరవనీయుడైన సందేశహరుని వాక్కు. ఏ కవికీ చెందిన వాక్కుకాదు, కాని మీరు విశ్వసించడం అనేది చాలా తక్కువ. ఇంకా ఇది ఏ జోతీష్యుని వాక్కు కూడా కాదు. కాని మీరు ఆలోచించడం అనేది చాలా తక్కువ. ఇది అసలు సర్వలోకాల ప్రభువు తరఫు నుండి అవతరించింది. ఒక వేళ ఇతను (ధైవప్రవక్త) స్వయంగా కల్పించి ఏధైనా విషయాన్ని మాకు ఆపాదించి ఉంటే, మేము ఇతని కుడిచెయ్యిని పట్టుకునేవారము, ఇతని మెడ నరాన్ని కోసివేసేవారము. అప్పుడు మీలో ఎవరూ (మమ్మల్ని) ఈ పని చెయ్యకుండా ఆపగలిగేవారు కాదు. అసలు ఇది దైవభీతికలవారికి ఒక హితోపదేశం.

**(ఖుర్‌ఆన్ 69 : 38-48)**

ఇంతకు పూర్వం మేము గ్రంథాన్ని ఇచ్చిన ప్రజలు దీనిని (ఖుర్‌ఆన్)ను విశ్వసిస్తారు. ఇది వారికి వినిపించ బడినప్పుడు, వారు ఇలా అంటారు, "మేము దీనిని విశ్వసించాము ఇది నిజంగానే మా ప్రభువు తరఫు నుండి

వచ్చిన సత్యం. మేము మొదటి నుండీ ముస్లిములమే."

**(ఖుర్ఆన్ 28 : 52)**

ఈ ప్రజలు ఖుర్ఆన్ ను గురించి ఆలోచన చేయరా? ఇది అల్లాహ్ తరపునుండి కాక వేరొకరి తరపునుండి వచ్చి ఉన్నట్లయితే ఇందులో ఎన్నో పరస్పర విరుద్ధాలైన విషయాలు ఉండేవి. **(ఖుర్ఆన్ 4 : 82)**

## మర్యమ్ కుమారుడు ఈసా (అ.స) ఇచ్చిన శుభవార్త?

"ఓ ఇస్రాయిల్ వంశీయులారా! నేను మీ వద్దకు అల్లాహ్ చే పంపబడిన సందేశహరుణ్ణి; నాకు పూర్వము వచ్చిన తౌరాత్ గ్రంథాన్ని ధృవపరుస్తున్నాను; నా తరువాత అహ్మద్ అనే ప్రవక్త రాబోతున్నాడు అనే శుభ వార్తను అందజేస్తున్నాను. **(ఖుర్ఆన్ 61:6)**

**నోట్:** అహ్మద్ అనేది ముహమ్మద్ (స) ప్రవక్తకు మరో పేరు అనే విషయం మనము ఈ పుస్తక ప్రారంభంలోనే తెలుసుకున్నాము.

## మోక్ష మార్గం ఎవరి ద్వారా?

దైవదాసులకు ఋజుమార్గం చూపెట్టడానికి ప్రవక్తలు ఎవరైతే వచ్చారో ఆయా కాలాలలో అప్పటి ప్రజలకు వారి

ద్వారానే మోక్షమార్గం ఉండేది. మోక్షం అంటేనే నిత్య నరకం నుండి రక్షించబడి, నిత్య స్వర్గంలోనికి ప్రవేశించడం. ఇప్పుడు మన మందరం ముహమ్మద్ (స) ప్రవక్తగారి అనుచర సమాజంలో జన్మించాము కాబట్టి మనందరికి మోక్ష మార్గం ముహమ్మద్(స) ప్రవక్త ద్వారానే కలుగుతుందే తప్ప మరి ఎవరి ద్వారాను మోక్ష మార్గం కలగదు. మీరు ఈ విషయాన్ని విశ్వసించిన, విశ్వసించక పోయిన ఇది మాత్రం సత్యం. సత్య విషయాలు వినడానికి చేదుగా అనిపించిన వాటిని జీర్ణించుకుంటేనే పరలోకంలో శాశ్వతమైన మోక్షం మరియు శాంతి పొందగలము.

## ఇప్పుడు నేను ఏమిచెయ్యాలి!

సత్యాన్ని స్వీకరించాలా లేక తిరస్కరించాలా!

స్వీకరిస్తే ☞ స్వర్గం

తిరస్కరిస్తే ☞ నరకం

నిర్ణయం మీ చేతుల్లోనే ఉంది.

## ఇస్లాం వైపునకు ఆహ్వానం

సత్యాన్ని స్వీకరించడానికి హెూదా, అంతస్తు, ఆస్తి, ఐశ్వర్యాలు, అహం, అడ్డురాకుడదు సుమా! ప్రాపంచిక

జీవితం నాలుగు రోజుల ముచ్చట తప్ప మరేమీ కాదు. పరలోక జీవితమే శాశ్వతం. పరలోక సాఫల్యమే గొప్ప సాఫల్యం.

కావున పరిపూర్ణ ధర్మమైన ఇస్లాం (శాంతి) వైపునకు మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము. ఇస్లాం ధర్మాన్ని స్వీకరించండి. పరలోకంలో ఎన్నటికి  అంతం కాని స్వర్గ సుఖాలను పొందండి. ఇదే మా ప్రేమ పూర్వక ఆహ్వానము.

మీరు సత్యధర్మం (ఇస్లాం) ను స్వీకరించాలనుకుంటే ఇలా పలకండి.

**అష్హదుఅన్ లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహు.**

**అనువాదం:** నేను సాక్ష్యం ఇస్తున్నాను అల్లాహ్ తప్ప ఆరాధనకు అర్హుడు మరెవ్వరు లేరని, మరియు నేను సాక్ష్యం ఇస్తున్నాను ముహమ్మద్ (స) అల్లాహ్ యొక్క దాసుడు మరియు అల్లాచే పంపబడ్డ చిట్ట చివరి దైవ ప్రవక్త.

****

మీరు ఇస్లాం ధర్మము గురించి క్లుప్తంగా
తెలుసుకోవాలనుకుంటున్నారా!
అయితే ఈ క్రింది వెబ్ సైట్‌లను చూడగలరు.

www.irf.net.com

www.spreading peace.info

www.islamhouse.com

www.teluguislamic.net.com

www.islamreligion.com

www.islam-guide.com

www.missionislam.com

www.islamland.org

www.sultan.org

www.quran sunnah.com

సందేశ దాతలు ఎవరైనా ఈ పుస్తకాన్ని తమ తమ దావా
సెంటర్ల పేర్లతో ముద్రించాలని అనుకుంటే
**TRUE MESSAGE SOCIETY** వారితో సంప్రదించగలరు.

**యధార్థం ఏమిటంటే, ఒక జాతి స్వయంగా**
**తన లక్షణాలను మార్చుకోనంతవరకు**
**'అల్లాహ్' దాని స్థితిని మార్చడు.**
**(ఖుర్ఆన్ 13 : 11)**

**చూడకుండానే తమ ప్రభువుకు భయపడే వారికి, తప్పకుండా మన్నింపు, గొప్ప ప్రతిఫలం లభిస్తాయి.**

**(ఖుర్ఆన్ 67: 12)**

---

**నిశ్చయంగా ఇస్లాం పూర్వపు పాపాలన్నింటినీ తుడిచి వేస్తుంది.**

**ముహమ్మద్ ప్రవక్త**

**(సల్లల్లాహు అలైహి వ సల్లం)**

**ఈ పుస్తకాన్ని అందించిన సందేశ దాతలతో పాఠకులు తమతమ అభిప్రాయాలను పంచుకంటారని ఆశిస్తున్నాము.**

---

మా చిరునామా :-